శ్లో॥ పిపీలికా మక్షికాది స్పృష్టం యద్ధ్రఢబీజకం
మృ చ్ఛిలా కేశమష్టం చ యద్వ్య ప్యశుచి పాచితమ్

తా. చీమలు, ఈగలు మున్నగువానిచే ముట్టుకొన బడినవి, ముదిరిపోయినవి; మట్టి, రాళ్లు జుట్టు వీనితో కూడి దుష్టమైనవి. ఏ రీతి నయినా అశుచియై ప్రాయశ్చిత్తము చేయబడినవియైనను అట్టివి.

శ్లో॥ అతి పక్వ మపక్వం చ తద్విహాయ సుపావనమ్
నైవేద్యం దీయతే తుభ్యం హనుమాన్ ప్రతిగృహ్యతాం

తా. మిక్కిలి పండినది, పూర్తిగ నుడుకనిది యగు వానిని విడిచి, పవిత్రమైన నైవేద్యమును నీ కిచ్చుచున్నాను. ఓ హనుమత్ప్రభూ! స్వీకరింపవలసినది.

శ్లో॥ ప్రతీక్షంతే సురా స్సర్వే ధూప స్యావసరం యతః
తేన తుష్టో భవ శ్రీమ న్నాంజనేయ నమోస్తు తే

తా. ఓ ఆంజనేయా! దేవత లందరు నీ ధూప సమయము కొరకు వేచియున్నారు కావున ఓ స్వామీ నా యీ ఆరాధనచే తుష్టుడవగుము. నీకు నమస్కారము.

శ్లో॥ ఏలా గుగ్గుల సంయుక్త గవాజ్యేన సుసంప్లుతః
ధూపోఽయం గృహ్యతాం దేవ! ఆంజనేయ
నమోస్తు తే

తా. ఏలకులు, గుగ్గులము వీనితో కూడిన ఆవునేతితో చేయబడిన యీ ధూపమును గ్రహింపుము. ఓ దేవా! ఆంజనేయా! నీకు నమస్కారము.

శ్లో॥ ఏవం యః పూజయే న్నిత్యం ప్రతిష్ఠిత మతంద్రితః
ఇహ భుక్త్వాఽఖిలా న్భోగా నంతే ముక్తిం స విందతి

తా॥ ఇట్లు ప్రతిష్ఠింపబడిన హనుమంతుని తొట్రుపాటు లేనివాడై ప్రతినిత్యము ఎవడు పూజించునో వాడు ఇహమున సకల భోగము లనుభవించి దేహాంతమున ముక్తి నందును.



శ్లో॥ హనూమ దాలయం గత్వా తత్పదాసక్త మానసః
సప్తాక్షరీం హనుమతో దశవారం జపేత్సుధీః

తా॥ హనుమంతుని ఆలయమునకు వెళ్ళి బుద్ధిమంతుడగు వాడు ఆ హనుమంతుని పాదపద్మములందే మనస్సును నిల్పి శ్రీ హనుమంతుని సప్తాక్షరీ మహామంత్రమును పది మార్లు జపించవలెను.



ఇతి శ్రీ పరాశరసంహితాయాం శ్రీ పంచముఖ హనుమన్మంత్ర వివరణే శ్రీ హనుమద్విగ్రహ ప్రతిష్ఠాకథనం నామ చత్వారింశః పటలః



—: x :—